# దీక్ష

ఇది అయ్యప్ప స్వాములు మాలధారణ చేసే కాలం. సంక్రాంతి సమయంలో మకరజ్యోతి దర్శనం చేసే స్వాములు ఈ కార్తికంలోనే మాలధారణ చేస్తారు. నలభై ఒక్కరోజులపాటు నియమనిష్టలు పాటిస్తూ దీక్ష పూర్తిచేస్తారు. సాధారణ ప్రజలకు కూడా భగవంతునికి చేరువ చేసే ఇలాంటి వ్రత దీక్షల వల్లనే మనిషిలో ధర్మాచరణ పట్ల ఆసక్తి పెరుగుతుంది. క్రమశిక్షణను, రుజువర్తనను అలవర్చుకునేందుకు ఇటువంటి దీక్షలు ఎంతగానో ఉపకరిస్తాయి. 'స్వామి' అన్న సంబోధనతో అందరిలో సమభావం అలుముకుంటుంది. గొప్ప సామాజిక ప్రయోజనం ఒనగూడుతుంది. దీక్షా సమయంలో పాటించే ఏకభుక్తం (ఒంటిపూట భోజనం) వంటి నియమాలు దీక్షాపరునికి ఆరోగ్యలాభాన్ని చేకూరుస్తాయి. ఆధ్యాత్మికంగా ఉన్నతిని కలిగిస్తాయి. అయ్యప్ప దీక్ష అనేక కఠిన నియమాలతో కూడివున్నా అలుపెరుగని ఉత్సాహాన్ని, జీవన గమనాన్ని సరైన దిశలో ముందుకు ఉరికించగల ఉత్తేజాన్ని అందిస్తుంది. దీక్షాపరులు రోజూ సూర్యోదయానికి ముందు, సూర్యాస్తమయం తర్వాత పీఠాన్ని నెలకొల్పుకుని అయ్యప్పను పూజిస్తారు. ఈ పూజ దేవాలయంలో గానీ, పూజ గదిలో కానీ చేయాలి. మకర సంక్రాంతి వరకు ఊరూరా ఏదో ఒకచోట పదిమందీ కలిసి సామూహికంగా పడిపూజలు నిర్వహించి, భజన గీతాలు ఆలపిస్తారు. నిత్యపూజలోనూ, పడిపూజలోనూ కూడా అయ్యప్ప దీక్షాపరులకు ఉపయోగించే పూజావిధిని ఈ నెల ప్రత్యేక అనుబంధంగా అందిస్తున్నాం. భజనగీతాలను పొందుపరిచాం. అలాగే దీక్షా సమయంలో, శబరియాత్రలో తప్పనిసరిగా పాటించాల్సిన నియమాలు – తు.చ. తప్పకూడని నిబంధనలు ఇందులో ఉన్నాయి. యాత్రామార్గాలు, శబరి యాత్రికులకు అవసరమయ్యే అత్యవసర సమాచారం వెనుక పేజీల్లో పొందుపరిచాం. ఈ దీక్షాసమయంలో అయ్యప్ప స్వాములకు భక్తిపత్రిక అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.




- దీక్షలో నిరంతరం మాల ధరించాలి. తులసిమాల, కరిమాల లేదా రుద్రాక్షమాలను అయ్యప్పముద్రతో కలిపి అయ్యప్పమాలగా వ్యవహరిస్తారు. దీక్షా వస్త్రాలుగా నల్లరంగు దుస్తులు ధరించడం మంచిది.
- నిత్యం సూర్యోదయానికి ముందు, సూర్యాస్తమయం తరువాత చన్నీటితో తలస్నానం చేయాలి.
- విభూతి, చందనం, కుంకుమతో నుదుట బొట్టు ధరించాలి.
- పూజా సమయాల్లో, భిక్ష తీసుకునే సమయాల్లో చొక్కా ధరించకూడదు.
- సాత్వికాహారం ఒంటిపూట మాత్రమే తీసుకోవాలి. రెండోపూట అల్పాహారం శుచిగా స్వీకరించాలి. పాలు, మజ్జిగ, పళ్లు తీసుకోవచ్చు.
- తాంబూలం, ధూమపానం, మద్యపానం, జూదం వంటి దురలవాట్లను విడిచిపెట్టాలి.
- కఠిన బ్రహ్మచర్యం పాటించాలి.
- చాప, దుప్పటి వేసుకుని నేలమీద నిద్రపోవాలి. మంచంపై పడుకోవడం, కూర్చోవడం పనికిరావు.
- క్షురకర్మ చేయించుకోకూడదు, పాదరక్షలు ధరించకూడదు.
- మలమూత్ర విసర్జన తర్వాత కాళ్లు, చేతులు, కళ్లు, నోరు శుభ్రపరుచుకోవాలి. శుచిగా ఉండాలి.
- మితభాషిగా ఉండాలి. ఎవరిపై కోపగించుకోకూడదు. అబద్ధాలాడకూడదు. దగ్గరి బంధువులైనా సరే చనిపోతే వారి శవాన్ని చూడకూడదు.
- అపరకర్మలలో పాల్గొనకూడదు. అనుకోనిరీతిలో అనివార్యమై అలా చేసినప్పుడు తలస్నానం చేసి అయ్యప్ప శరణుఘోష చేయాలి.



**దీక్షాకాలంలో ఏమైనా అనుమానాలు వస్తే గురుస్వామిని సంప్రదించాలి.**

## దీక్ష తీసుకోకూడని సందర్భాలు

- తల్లి లేదా తండ్రి మరణించినప్పుడు పన్నెండు నెలలు సూతకం పాటించాలి. ఆ సమయంలో మాలధారణతో యాత్ర చేయకూడదు. ఇంటిలో నూతన శిశువు జన్మిస్తే శుభసూతకం పాటించాలి. ఇంటిలోని స్త్రీలు ఏడోనెల గర్భవతులైతే పురుషులు మాలధారణ చేయకూడదు.
- దీక్షా సమయంలో అనుకోని అశుభాలు ఏర్పడితే స్వాములు దీక్ష విరమించాలి. మళ్లీ దీక్ష తీసుకోవాలంటే పదునెట్టాంబడి (18మెట్లు) ఎక్కే సమయానికి 41రోజులు దీక్ష పూర్తిచేయాల్సి ఉంటుంది.
- పురుషులు ఎవరైనా దీక్ష స్వీకరించవచ్చు. పదేళ్లలోపు, రజస్వల కాని బాలికలు, రుతుక్రమం ఆగిపోయిన స్త్రీలు మాత్రమే దీక్షకు అర్హులు.

## దీక్షలో స్వాముల పేర్లు/శ్రేణులు

| దీక్షతీసుకున్న సంవత్సరం | స్వామి పేరు |
|---|---|
| 1వ సంవత్సరం | కన్నెస్వామి |
| 2వ సంవత్సరం | కత్తిస్వామి |
| 3వ సంవత్సరం | గంటస్వామి |
| 4వ సంవత్సరం | గదస్వామి |
| 5వ సంవత్సరం | గురుస్వామి |
| 6వ సంవత్సరం | జ్యోతిస్వామి |
| 7వ సంవత్సరం | సూర్యస్వామి |
| 8వ సంవత్సరం | చంద్రస్వామి |
| 9వ సంవత్సరం | త్రిశూలస్వామి |
| 10వ సంవత్సరం | శంఖుస్వామి |
| 11వ సంవత్సరం | చక్రస్వామి |
| 12వ సంవత్సరం | నాగాభరణ స్వామి |
| 13వ సంవత్సరం | శ్రీహరిస్వామి |
| 14వ సంవత్సరం | పద్మస్వామి |
| 15వ సంవత్సరం | శ్రీ స్వామి |
| 16వ సంవత్సరం | శబరిగిరి స్వామి |
| 17వ సంవత్సరం | ఓంకార స్వామి |
| 18వ సంవత్సరం | నారికేళస్వామి |





## మాలధారణం

గురుస్వామి లేదా కన్నతల్లి లేదా దీక్షలో ఉన్న అర్చకస్వామి చేతుల మీదుగా మాలధారణ చేయాలి. కార్తికమాసం ప్రారంభం రోజున కొందరు దీక్ష స్వీకరిస్తారు. కార్తిక సోమవారం, కార్తిక పూర్ణిమ లేదా పర్వదినాలలో మాలధరించవచ్చు. యాత్రకు బయలుదేరే సమయానికి లేదా అయ్యప్ప దర్శనం చేసే సమయానికి 41 రోజులు పూర్తయ్యేలా చూసుకుని దీక్ష స్వీకరించాలి. గత సంవత్సరం ధరించిన దీక్షావస్త్రాలను దాచిపెట్టుకుని ఈ సంవత్సరం వినియోగించవచ్చు. శనిదోష నివారణకు నల్లదుస్తులు, రాహుదోష నివారణకు నీలరంగు దుస్తులు... ఇలా దోషనివారణ ప్రాతిపదికగా అయ్యప్పస్వాములు దీక్షావస్త్రాలను వినియోగిస్తున్నారు. అన్నింటిలోనూ నల్లరంగు దుస్తులే మంచివి. ప్యాంటు, చొక్కా ధరించినప్పటికీ ఉత్తరీయం తప్పనిసరి. పూజావేళ కచ్చితంగా పంచెమాత్రమే కట్టుకోవాలి. తువ్వాళ్లు, దుప్పట్లు, చేతి సంచీ వంటివన్నీ నల్లరంగులోనే ఉండాలి. దీక్షాకాలంలో రెండుపూటలా స్నానం చేయాలి. ప్రతిసారి ఉతికి ఆరవేసిన వస్త్రాలను మాత్రమే ధరించాలి. అందుకు తగ్గట్లుగా

దీక్షావస్త్రాలను సిద్ధం చేసుకుని ధరించి మాలధారణ కోసం గురుస్వామి వద్దకు ఆలయానికి వెళ్లాలి.

అయ్యప్పమాల ఎప్పటికప్పుడు కొత్తగా ఉండాలనే నియమం లేదు. మైలతాకని చోట దాచుకున్న మాలను ప్రతిసంవత్సరం ధరించవచ్చు. చాలామంది మాల విసర్జన చేసేప్పుడు నదిలో కానీ, చెట్టుమీదకానీ విడిచిపెడతారు. మాలను దాచిపెట్టుకోవడమూ మంచిదే. దీక్షాస్వీకారానికి ముందురోజున క్షురకర్మ చేసుకోవాలి. దీక్షను ఇచ్చినవారిని గురువుగా భావించాలి. వారికి పాదాభివందనం చేయాలి. మాలధారణ చేసేప్పుడు మాలలోని అయ్యప్పముద్రను పూజించాలి.

జ్ఞాన సముద్రాం శాస్త్రముద్రాం గురుముద్రం నమామ్యహం
వనముద్రాం శుద్ధముద్రాం రుద్రముద్రాం నమామ్యహం
శాంతముద్రాం సత్యముద్రాం వ్రతముద్రాం నమామ్యహం
శబర్యాశ్రమ సత్యేన ముద్రాం పాదుసదాపిమే
గురుదక్షిణ యాపూర్వం తస్యానుగ్రహకారిణే
శరణాగత ముద్రాఖ్యం త్వన్ముద్రాం ధారయామ్యహం
చిన్ముద్రాం కేసరీముద్రాం భద్రముద్రాం నమామ్యహం
శబర్యాచల ముద్రాయై నమస్తుభ్యం నమోనమః

## నిత్యపూజ పడిపూజ

అయ్యప్ప మండలదీక్ష తీసుకున్నవారు ప్రతిరోజూ ఉదయం, సాయంత్ర వేళలో చేసుకోవాల్సిన పూజావిధానం ఇది. పడిపూజలో సైతం ఈ విధానం ఉపయోగపడుతుంది. పడిపూజలో ఈ పుస్తకంలోని ఉపచారాలన్నింటినీ చేయాలి. మండలకాలంలో ఉదయ సాయంత్రవేళల్లో ఈ విధానాన్ని కొంచెం సంక్షిప్తంగా చేయవచ్చు. అందుకోసం....

91,92, 93 పేజీల్లోని పూజావిధిని యధాతథంగా అనుసరించండి.
94వ పేజీలోని ఏకవింశతి నామాలను చదివి గణపతికి పుష్పాలు సమర్పించండి.
97వ పేజీలోని షోడశనామాలను చదివి సుబ్రహ్మణ్యునికి నమస్కరించండి.
98వ పేజీలోని ధ్యానశ్లోకాన్ని చదివి మహాలక్ష్మిని స్మరించండి.
100వ పేజీలోని పడిపూజను విడిచిపెట్టండి.
101వ పేజీనుంచి పూజావిధిని యధాతథంగా అనుసరించండి. పూజాద్రవ్యాలకు బదులుగా అక్షతలు, పువ్వులు వంటివి యధాశక్తి సమర్పించవచ్చు.

# అయ్యప్ప పూజావిధి



ధ్యానం

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోప శాంతయే
గురుబ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః

తదేవలగ్నం సుదినం తదేవ
తారాబలం చంద్రబలం తదేవ
విద్యాబలం దైవబలం తదేవ
లక్ష్మీపతేతేంఘ్రియుగం స్మరామి
యశ్శివోనామరూపాభ్యాం యాదేవీ సర్వమంగళామ్
తయో సంస్మరణాత్పుంసాం సర్వతో జయమంగళమ్
దీపం వెలిగించి గంట మోగించాలి

ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రాక్షసాం
కురుఘంటారవం తత్ర దేవతాహ్వానలాంఛనం

శిరస్సుపై బొటనవేలితో నీళ్లు చల్లుకుంటూ కింది మంత్రం చెప్పాలి.
అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాం గతోపివ
యస్మరేత్ పుండరీకాక్ష సబాహ్యాంభ్యతర శ్శుచిః
పుండరీకాక్ష పుండరీకాక్ష పుండరీకాక్షాయ నమః

ఆచమనం

ఆచమన పాత్ర (గ్లాసు)లోని నీళ్లను ఉద్దరిణి (స్పూను)తో కుడిచేతిలోకి తీసుకుని చప్పుడు కాకుండా కిందిపెదవితో స్వీకరించాలి. ఇలా మొదటి మూడు నామాలకూ చేయాలి.

ఓం కేశవాయ స్వాహా | ఓం నారాయణాయ స్వాహా | ఓం మాధవాయ స్వాహా

ఉద్ధరిణితో మరోసారి నీళ్లు తీసుకుని కుడిచేతిని కడుక్కుని వస్త్రంతో తుడుచుకోవాలి. తరువాత కిందనున్న మిగతా నామాలు చదవాలి.

ఓం గోవిందాయ నమః, ఓం విష్ణవే నమః, ఓం మధుసూదనాయ నమః,
ఓం త్రివిక్రమాయ నమః, ఓం వామనాయ నమః, ఓం శ్రీధరాయ నమః

ఓం హృషీకేశాయ నమః, ఓం పద్మనాభాయ నమః, ఓం దామోదరాయ నమః
ఓం సంకర్షణాయ నమః, ఓం వాసుదేవాయ నమః
ఓం ప్రద్యుమ్నాయ నమః
ఓం అనిరుద్ధాయ నమః
ఓం పురుషోత్తమాయ నమః
ఓం అధోక్షజాయ నమః
ఓం నారసింహాయ నమః
ఓం అచ్యుతాయ నమః
ఓం జనార్దనాయ నమః
ఓం ఉపేంద్రాయ నమః
ఓం హరయే నమః
ఓం శ్రీకృష్ణాయ నమః

భూతోచ్చాటన

కింది శ్లోకాన్ని చదువుతూ అక్షతలు వాసన చూసి పీటకింద వేయాలి.
ఉత్తిష్ఠంతు భూత పిశాచాః ఏతే భూమి భారకాః
ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమారభే

ప్రాణాయామం

ఓం భూః ఓం భువః ఓగుం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓం సత్యం
ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్
ఓం ఆపోజ్యోతి రసోమృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్

సంకల్పం

మమ ఉపాత్త సమస్త దురితక్షయ ద్వారా శ్రీపరమేశ్వర ముద్దిశ్య శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శుభాభ్యాం శుభేశోభనే ముహూర్తే శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్య బ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే, కలియుగే ప్రథమ పాదే, జంబూద్వీపే, భరతఖండే, మేరోః దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య.... (హైదరాబాద్ ప్రాంతవాసులు వాయవ్యప్రదేశే అని, ఇతరులు తమతమ ప్రాంతాల దిక్కును చెప్పుకోవాలి) కృష్ణా గోదావర్యోః మధ్యదేశే సమస్త దేవతా బ్రాహ్మణ హరిహర గురుచరణ సన్నిధౌ అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన .... నామసంవత్సరే దక్షిణాయనే .... ఋతౌ ...... మాసే, ....పక్షే ..... నక్షత్ర ప్రయుక్త ..... తిథౌ, ..... వాసరే శుభనక్షత్రే శుభయోగే శుభకరణే, ఏవంగుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ, శ్రీమాన్ శ్రీమత:........ గోత్ర: .......... నామధేయ: .......... గోత్రోద్భవస్య.......... నామధేయస్య అస్మాకం

సహకుటుంబానాం క్షేమ స్థైర్య వీర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాదీనాం అభివృద్ధ్యర్థం అభ్యుదయార్థించ ధర్మ, అర్థ, కామ, మోక్ష, చతుర్విధ ఫలపురుషార్థ సిద్ధ్యర్థం ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం విశేషతః అస్మత్ శబరగిరియాత్రా పరిపూర్ణత్వ సిద్ధ్యర్థం శ్రీపూర్ణపుష్కలాంబాసమేత హరిహరపుత్ర శ్రీధర్మశాస్త శ్రీఅయ్యప్ప స్వామి ప్రీత్యర్థం, యావచ్ఛక్తి ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజాం కరిష్యే. తదంగ కలశారాధనం కరిష్యే

కలశపూజ

ఆచమనం కోసం వాడిన పాత్ర కాకుండా మరో ఆచమన పాత్ర (గ్లాసు)ను కలశపూజ కోసం వినియోగించాలి. కింది శ్లోకాన్ని చదువుతూ కలశాన్ని పసుపు, కుంకుమలతో అలంకరించాలి. కలశంపై కుడిచేతిని ఉంచి కింది శ్లోకాన్ని చెప్పాలి.



కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్ర సమాశ్రితః
మూలేతత్రస్థితో బ్రహ్మా మధ్యే మాతృగణా స్మృతాః
కుక్షౌతు సాగరాః సర్వే సప్తద్వీపా వసుంధరాః
రుగ్వేదో యజుర్వేదః సామవేదో అధర్వణః
అంగైశ్చసహితా స్సర్వే కలశాంబు సమాశ్రితః
కలశంలోని నీటిని తమలపాకుతో తిప్పుతూ ఈ క్రింది శ్లోకాన్ని పఠించాలి.
గంగేచ యుమునేచైవ గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరి జలేస్మిన్ సన్నిధిం కురు
ఆయాంతు దేవ పూజార్థం దురితక్షయ కారకాః
ఓం త్వం రాజా సర్వతీర్థానాం త్వమేవ జగతః పితః దేహిమే తీర్థం, తీర్థరాజ నమోస్తుతే
కలశోదకేన పూజాద్రవ్యాణి చ సంప్రోక్ష్య దేవమాత్మానంచ సంప్రోక్ష్య
కలశంలోని నీటిని దేవతామూర్తులపై, పూజాద్రవ్యాలపై చల్లాలి

పీఠపూజ

చేతిలో పుష్పాక్షతలు ఉంచుకుని స్వామి ఆసీనులై ఉన్న పీఠాన్ని అర్చించాలి
ఓం ఆధారశక్త్యై నమః ఓం మూలప్రకృత్యై నమః ఓం ఆదికూర్మాయై నమః ఓం ఆదివరాహాయై నమః ఓం అనంతాయై నమః ఓం పృథివ్యై నమః
ఓం రత్నమండపాయై నమః ఓం రత్నవేదికాయై నమః
ఓం స్వర్ణస్తంభాయై నమః ఓం శ్వేతశ్ఛత్రాయ నమః ఓం కల్పవృక్షాయ నమః ఓం క్షీరసముద్రాయ నమః ఓం సితచామరాభ్యాం నమః ఓం యోగపీఠాసనాయ నమః సమస్తోపచారాన్ సమర్పయామి
ఆదౌ శ్రీవిఘ్నేశ్వరపూజాం కరిష్యే

అక్షతధారణ : పసుపు గణపతి వద్ద కొన్ని అక్షతలు తీసుకుని కింది శ్లోకం చదివి శిరస్సుపై చల్లుకోవాలి.

శ్రీమహాగణాధిపతి దేవతాః సుప్రీతస్సుప్రసన్నోవరదో భవతు.
ఏతత్ఫలం పరమేశ్వరార్పణమస్తు.
ఉత్తరే శుభకర్మణ్యవిఘ్నమస్త్వితి భవంతో బ్రువంతు
ఉత్తరే శుభకర్మణ్యవిఘ్నమస్తు
శ్రీమహాగణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి

ఉద్వాసన : పసుపు గణపతిని ఆసీన పరిచిన తమలపాకును తూర్పునకు జరిపి మళ్లీ యథాస్థానంలో పెట్టాలి.

శ్రీమహాగణాధిపతయే నమః గణపతిం ఉద్వాసయామి
శ్రీమహాగణాధిపతయే నమః యథాస్థానం ప్రవేశయామి
శోభనార్థే క్షేమాయ పునరాగమనాయచ అక్షతలు వేసి నమస్కరించాలి.





## సుబ్రహ్మణ్య (దేవనాథ) స్వామిపూజ

శ్రీసుబ్రహ్మణ్య స్వామి బొట్టుపెట్టి, పూలాతో అలంకరించాలి.

ధ్యానం : నమస్కారం చేస్తూ ఈ కింది శ్లోకాలతో స్వామిని ఆవాహన చేయాలి.
షడ్వక్త్రం శిఖివాహనం త్రినయనం చిత్రాంబరాలంకృతం
శక్తిం వజ్రమసిం త్రిశూల మభయం ఖేటం ధనుశ్చక్రకం
పాశం కుక్కుట మంకుశంచ వరదంహస్తైర్దధానం స్సదా
ధ్యాయేదీప్సితసిద్ధిదం శివసుతం వందే సురారాధితం
అద్యపూర్వోక్త ఏవంగుణ విశేషణ విశిష్ఠాయాం అస్యాం శుభతిథౌ శ్రీవల్లీదేవసేనా సమేత శ్రీసుబ్రహ్మణ్యేశ్వర స్వామిన్ ధ్యాయామి. ఆవాహయామి. వల్లీదేవసేనా సమేత శ్రీసుబ్రహ్మణ్యేశ్వరస్వామినే నమః



| | |
|---|---|
| ఆసనార్థం అక్షతాన్ సమర్పయామి | (అక్షింతలు) |
| పాదయోః పాద్యం సమర్పయామి | (నీరు) |
| హస్తయోః అర్ఘ్యం సమర్పయామి | (నీరు) |
| ఆచమనీయం సమర్పయామి | (నీరు) |
| మధుపర్కం సమర్పయామి | (మధుపర్క నైవేద్యం) |
| శుద్ధోదక స్నానం సమర్పయామి | (నీరు) |
| వస్త్రయుగ్మం సమర్పయామి | (అక్షింతలు) |
| యజ్ఞోపవీతం సమర్పయామి | (అక్షింతలు) |
| దివ్యపరిమళ గంధాన్ ధారయామి | (చందనం) |
| గంధస్యోపరి కుంకుమాన్ సమర్పయామి | (అక్షింతలు) |
| అలంకరణార్థం ఆభరణార్థంచ అక్షతాన్ సమర్పయామి | (అక్షింతలు) |
| పుష్పమాల్యాన్ సమర్పయామి | (పూలహారాలు) |
| పుష్పైః పూజయామి | (పువ్వులు) |

### షోడశ నామావళి

ఓం జ్ఞానశక్త్యాత్మనే నమః
ఓం స్కందాయ నమః
ఓం అగ్నిగర్భాయ నమః
ఓం బాహులేయాయ నమః
ఓం గాంగేయాయ నమః
ఓం శరవణోద్భవాయ నమః
ఓం కార్తికేయాయ నమః
ఓం కుమారాయ నమః

ఓం షణ్ముఖాయ నమః
ఓం కుక్కుటధ్వజాయ నమః
ఓం భక్తిధరాయ నమః
ఓం గుహాయ నమః
ఓం బ్రహ్మచారయే నమః
ఓం షణ్మాతురాయ నమః
ఓం క్రౌంచభిదే నమః
ఓం శిఖివాహనాయ నమః

అధాంగపూజ (స్వామి శరీరావయవాలకు పూజ)

ఓం వల్మీకి భవాయ నమః పాదౌ పూజయామి
ఓం జితాసుర సైనికాయ నమః జానునీ పూజయామి
ఓం రుద్రయే నమః జంఘే పూజయామి
ఓం భయనాశాయ నమః ఊరుం పూజయామి
ఓం బాలగ్రహోచ్చాటనాయ నమః కటిం పూజయామి
ఓం భక్తపాలనాయ నమః నాభిం పూజయామి
ఓం సర్వాభీష్ట ప్రదాయ నమః హృదయం పూజయామి
ఓం విశాల వక్షసే నమః వక్షస్థలం పూజయామి
ఓం అభయప్రదాన ప్రశస్త హస్తాయ నమః బాహూన్ పూజయామి
ఓం నీలకంఠ తనయాయ నమః కంఠం పూజయామి
ఓం పతిత పావనాయ నమః చుబుకం పూజయామి
ఓం పురుష శ్రేష్ఠాయ నమః నాసికాం పూజయామి
ఓం పుణ్యమూర్తయే నమః శ్రవణాని పూజయామి
ఓం కమలలోచనాయ నమః లోచనాని పూజయామి
ఓం కస్తూరీ తిలకాంచిత ఫాలాయ నమః లలాటాని పూజయామిః
ఓం వేద విదుషే నమః ముఖం పూజయామి
ఓం త్రిలోకగురవే నమః శిరః పూజయామి
ఓం భస్మోద్ధూళిత విగ్రహాయ నమః సర్వాణ్యంగాని పూజయామి
ఓం వల్లిదేవసేనాసమేత శ్రీసుబ్రహ్మణ్యస్వామినే నమః
నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి
ధూపమాఘ్రాపయామి (అగరుధూపం చూపాలి) సాక్షాత్ దీపం దర్శయామి
(దీపం చూపాలి. నైవేద్యం సిద్ధం చేసుకోవాలి.)
అవసరార్థం కదళీఫల, నారికేళఖండద్వయం నివేదయామి
ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయ స్వాహా, ఓం వ్యానాయ స్వాహా,
ఓం ఉదానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా, ఓం బ్రహ్మణే స్వాహా,
అమృతాపిధానమసి, ఉత్తరాపోసనం సమర్పయామి, తాంబూలం సమర్పయామి

ఓం వల్లీదేవసేనా సమేత శ్రీసుబ్రహ్మణ్య స్వామినే నమః ఆనంద కర్పూర నీరాజనం సమర్పయామి. కర్పూర హారతి చూపించాలి
వల్లీదేవసేనా సమేత శ్రీ సుబ్రహ్మణ్యస్వామినే నమః మంత్రపుష్పం సమర్పయామి. ఛత్రం ధారయామి. చామరం వీచయామి. వాద్యం ఘోషయామి. ఆందోళికానారోహయామి. సమస్త రాజోపచార దేవోపచార భక్త్యుపచార శక్త్యుపచార పూజాం సమర్పయామి
పుష్పాక్షతలు సమర్పించాలి
షణ్ముఖం పార్వతీపుత్రం క్రౌంచశైల విమర్దనం
దేవసేనాపతిం దేవం స్కందం వందే శివాత్మజం
తారకాసుర హర్తారం మయూరాసన సంస్థితం
శక్తిపాణించ దేవేశం స్కంధం వందేశివాత్మజం
షడాననం కుంకుమ రక్తవర్ణం మహామతిం దివ్యమయూర వాహనం
రుద్రస్యసూనుం సురసైన్యనాథం గుహం సదాహం శరణం ప్రపద్యే
వల్లీదేవసేనా సమేత శ్రీసుబ్రహ్మణ్య స్వామినే నమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి శ్రీవల్లీదేవసేనా సమేత శ్రీసుబ్రహ్మణ్యేశ్వరస్వామి ప్రసాదం శిరసాగృహ్ణామి
అక్షతలు శిరస్సుపై వేసుకోవాలి
అనయాపూజయా భగవాన్ సర్వాత్మకః వల్లీదేవసేనా సమేత శ్రీ సుబ్రహ్మణ్య స్వామినే నమః సుప్రీతః సుప్రసన్నో వరదోభవతు... తథాస్తు.



## శ్రీమహాలక్ష్మిపూజ



ధ్యానం
లక్ష్మీం క్షీరసముద్ర రాజతనయాం శ్రీరంగధామేశ్వరీం
దాసీభూత సమస్త దేవవనితాం లోకైకదీపాంకురాం
శ్రీమన్మంద కటాక్ష లబ్ధ విభవత్ బ్రహ్మేంద్ర గంగాధరాం
త్వాం త్రైలోక్య కుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియాం
ఓం శ్రీ లక్ష్మీదేవ్యై నమః ధ్యాయామి. ఆవాహయామి. ఆసనార్థం అక్షతాన్ సమర్పయామి పాదయోః పాద్యం సమర్పయామి హస్తయోః అర్ఘ్యం సమర్పయామి, ఆచమనీయం సమర్పయామి మధుపర్కం సమర్పయామి, శుద్ధోదక స్నానం సమర్పయామి వస్త్రయుగ్మం సమర్పయామి, దివ్యపరిమళ గంధాన్ ధారయామి గంధస్యోపరి కుంకుమాన్ సమర్పయామి, అలంకరణార్థం ఆభరణార్థంచ అక్షతాన్ సమర్పయామి, పుష్పమాల్యాన్ సమర్పయామి, పుష్పైః పూజయామి

## పడిపూజ

అష్టాదశ సోపాన దేవతలకి (18 మెట్ల దేవతలకు) పూజ చేయాలి. ప్రతి మెట్టుకు మంత్రం చదవగానే చివరిలో 'స్వరూప శ్రీహరిహర పుత్రాయనమః స్వామియే శరణం అయ్యప్ప' అని శరణు పలకాలి.

1. ఓం ఒణ్ణాం తిరుప్పడి ప్రథమ సోపానాధిష్ఠాన అకార, ఉకార, మకార మంత్ర ప్రణవ స్వరూప శ్రీహరిహర పుత్రాయనమః స్వామియే శరణం అయ్యప్ప
2. ఓం రెండాం తిరుప్పడి ద్వితీయ సోపానాధిష్ఠాన
3. ఓం మూణాం తిరుప్పడి తృతీయ సోపానాధిష్ఠాన బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూప త్రిమూర్త్యాత్మక
4. ఓం నాళం తిరుప్పడి చతుర్థ సోపానాధిష్ఠాన చతుర్ముఖ బ్రహ్మస్వరూప
5. ఓం నాళం తిరుప్పడి పంచమ సోపానాధిష్ఠాన సద్యోజాతాది పంచబ్రహ్మ
6. ఓం ఆరాం తిరుప్పడి షష్ఠమ సోపానాధిష్ఠాన షణ్ముఖ స్వరూప
7. ఓం ఏళాం తిరుప్పడి సప్తమ సోపానాధిష్ఠాన సప్తర్షి
8. ఓం ఎట్టాం తిరుప్పడి అష్టమ సోపానాధిష్ఠాన అష్టదిక్పాలక
9. ఓం ఒంబందాం తిరుప్పడి నవమసోపానాధిష్ఠాన నవగ్రహ
10. ఓం పత్తాం తిరుప్పడి దశమ సోపానాధిష్ఠాన దశావతార
11. ఓం పదినోణ్ణం తిరుప్పడి ఏకాదశ సోపానాధిష్ఠాన ఏకాదశ రుద్ర
12. ఓం పన్నెండాం తిరుప్పడి ద్వాదశ సోపానాధిష్ఠాన ద్వాదశాదిత్య
13. ఓం పదిమూణాం తిరుప్పడి త్రయోదశ సోపానాధిష్ఠాన త్రయోదశ మధ్య
14. ఓం పదినాలాం తిరుప్పడి చతుర్దశ సోపానాధిష్ఠాన చతుర్దశ భువనాధిప
15. ఓం పదినైదాం తిరుప్పడి పంచదశ సోపానాధిష్ఠాన ద్విపక్ష
16. ఓం పదినారం తిరుప్పడి షోడశసోపానాధిష్ఠాన షోడశకళాత్మక
17. ఓం పదినేళాం తిరుప్పడి సప్తదశ సోపానాధిష్ఠాన శ్రీమోహినీ పుత్ర
18. ఓం పదినెట్టాం తిరుప్పడి అష్టాదశ సోపానాధిష్ఠాన శ్రీమఖిలాండకోటి బ్రహ్మాండ నాయక స్వరూప రత్న సింహాసనాధిష్ఠాన శ్రీపూర్ణపుష్కళాంబాసమేత శ్రీహరిహర పుత్రాయనమః

## ధ్యానం

ధ్యాయేదానందకందం పరమ గురువరం జ్ఞానదీక్షా కటాక్షం
చిన్ముద్రం సత్సమాధిం సుకృతి మన మనోమందిరం సుందరాంగం
శాంతం చంద్రావతంసం శబరిగిరి వరోత్తుంగ పీఠే నిషణ్ణం
చింతారత్నాభిరామం శ్రుతి వినుతపదాంభోరుహం భూతనాథం
శ్రీ అయ్యప్పస్వామినే నమః ధ్యాయామి.
పుష్పాక్షతలు స్వామివారిపై వేయాలి



ఆవాహనం (దేవునికి ఆహ్వానం)

ఓం సహస్ర శీర్షాపురుషః సహస్రాక్షస్సహస్రపాత్
సభూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠదశాంగులమ్
ఆగచ్ఛ భగవన్ దేవస్థానే చాస్మిన్ స్థిరోభవ
యావత్ పూజాం కరిష్యేహం తావత్త్వం సన్నిధౌ వసన్
అస్మిన్ బింబే శ్రీపూర్ణపుష్కలాంబా సమేత శ్రీధర్మశాస్తారం ఆవాహయామి
సుప్రీతో సుప్రసన్నో వరదోభవ
స్వామివారిపై పుష్పాక్షతలు వేయాలి

ఆసనం (దేవునికి ఆసనం సమర్పించడం)

నానావర్ణ సమాయుక్తం పుష్పగంధైశ్చధూపితం
ఆసనందేవ దేవేశ ప్రీత్యర్థ ప్రతిగృహ్యతాం
శ్రీధర్మశాస్త్రే నమః ఆసనం సమర్పయామి

ప్రాణప్రతిష్ఠ (ప్రతిమ లేదా ఫొటోలోనికి దైవీశక్తిని ప్రతిష్ఠించడం)

ఓం అస్యశ్రీ ప్రాణప్రతిష్ఠా మహామంత్రస్య బ్రహ్మావిష్ణు మహేశ్వరా రుషయః
రుగ్యజుస్సామాథర్వాణి ఛందాంసి సకల జగత్ సృష్టి స్థితి సంహారకారిణి
ప్రాణశక్తిః పరాదేవతా ఆం బీజం హ్రీం శక్తిః క్రోం కీలకం ప్రాణప్రతిష్ఠాపనే
వినియోగః
ఆం అంగుష్ఠాభ్యాం నమః, హ్రీం తర్జనీభ్యాం నమః, క్రోం మధ్యమాభ్యాం నమః
ఆం అనామికాభ్యాం నమః, హ్రీం కనిష్ఠికాభ్యాం నమః, క్రోం కరతలకరపృష్ఠాభ్యాం
నమః,
ఆం హృదయాయనమః, హ్రీం శిరసే స్వాహా, క్రోం శిఖాయైవషట్
ఆం కవచాయహుం, హ్రీం నేత్రత్రయాయ వౌషట్, క్రోం అస్త్రాయ ఫట్
భూర్భువస్సురోమితి దిగ్బంధః, రక్తాంబోధిస్థ పోతోల్లసత్ అరుణ సరోజాధిరూఢా
కరాబ్జైః, పాశం కోదండ మిక్షుద్భవమణిగుణ మప్యంకుశం పంచబాణాన్
బిభ్రాణాసృ క్కపాలం త్రినయనలసితా పీనవక్షోరుహాఢ్యా, దేవీ బాలార్క వర్ణా

భవతు సుఖకరీ ప్రాణశక్తిః పరానః
అస్యాం మూర్తౌ సర్వేంద్రియాణిమనస్, త్వక్ చక్షు, శ్రోత్ర, జిహ్వాగ్రాణ, వాక్పాణి,
పాదపాయూపక్తాక్యాని, ప్రాణాపాన వ్యానోదాన సమానాశ్చ ఆగత్య,
సుఖంజిరం తిష్టంతు స్వాహా.
పుష్పం, అక్షతలు, జలం స్వామిపై వేయాలి.
ఆసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమిహానోదేహిభోగం, జ్యోక్పశ్యేమ
సూర్యముచ్చరంత మనుమతే మృళాయనః స్వస్తి.
ఆవాహితోభవ, స్థాపితోభవ, సన్నిహితోభవ, సన్నిరుద్దోభవ, అవకుండితోభవ,
సుప్రీతోభవ, సుప్రసన్నోభవ, సుముఖోభవ, వరదోభవ
ప్రసీద ప్రసీద స్వామిన్
జగన్నాధ యవత్పుజావసావకం తావత్వం ప్రీతిభావేన బింబేస్మిన్ సన్నిధిం కురు.

పాద్యం (కాళ్లు కడుక్కునేందుకు నీరు)

భూతనాథ నమస్తేస్తు నరకార్ణవ తారక
పాద్యం గృహాణదేవేశ మమసౌఖ్యం వివర్ధయ
ధర్మశాస్తే నమః పాదయోః పాద్యం సమర్పయామి
ఉద్ధరిణితో నీటిని పాదాలపై విడిచిపెట్టాలి

అర్ఘ్యం (చేతులు కడుక్కునేందుకు నీరు)

వ్యక్తావ్యక్త స్వరూపాయ హృషీకేశాయతే నమః
మయా నివేదితో భక్త్యా అర్ఘ్యోయం ప్రతిగృహ్యతాం
ధర్మశాస్తే నమః అర్ఘ్యం సమర్పయామి
ఉద్ధరణితో నీటిని స్వామికి చూపి పళ్లెంలో విడిచిపెట్టాలి

ఆచమనీయం (తాగేందుకు నీరు)

మందాకినీ సమంవారి తాపపాపహారం శుభం
తదితం కల్పితం దేవ సమ్యగాచమ్యతాం త్వయా
ధర్మశాస్తే నమః ఆచమనీయం సమర్పయామి
ఉద్ధరణితో నీటిని స్వామికి చూపి పళ్లెంలో విడిచిపెట్టాలి

పంచామృత స్నానం

స్నానం పంచామృతైర్దేవ గృహాణ పురుషోత్తమ
అనాథనాథ సర్వజ్ఞ గీర్వాణ ప్రణవ ప్రియ
ధర్మశాస్తే నమః పంచామృత స్నానం సమర్పయామి
పంచామృత అభిషేకం చేయాలి



### క్షీరాభిషేకం

కామధేను సముద్భూతం దేవరుషి పితృతృప్తితాం
పయోదదామి దేవేశ స్నానాయ ప్రతిగృహ్యతాం
ధర్మశాస్తే నమః క్షీరాభిషేకం సమర్పయామి
ఆవుపాలతో అభిషేకించాలి

### దధిస్నానం

చంద్రమండల సంకాశం సర్వదేవ ప్రియందధిః
స్నానార్థంతే మయాదత్తం పంచశైల నివాసినే
శ్రీ ధర్మశాస్తే నమః దధిస్నానం సమర్పయామి
పెరుగు అభిషేకించాలి

### ఆజ్యస్నానం

ఆజ్యం సురాణమాహారం ఆజ్యం యజ్ఞే ప్రతిష్ఠితం
ఆజ్యం పవిత్రం పరమం స్నానార్థం ప్రతిగృహ్యతాం
శ్రీ ధర్మశాస్తేనమః ఆజ్యస్నానం సమర్పయామి
ఆవునెయ్యితో అభిషేకం నిర్వహించాలి

### మధుస్నానం

సర్వౌషధి సముత్పన్నం పీయూష సదృశం మధు
స్నానార్థంతే ప్రయచ్ఛామి స్వీకరుష్వ దయానిధే
శ్రీ ధర్మశాస్తేనమః మధునాస్నపయామి
తేనెతో అభిషేకం చేయాలి

### చందనాభిషేకం

కర్పూర తైల సమాయుక్తం సుగంధ ద్రవ్యసంయుతం
గంధోదకం మయాదత్తం గృహాణ మహేశ్వరా
శ్రీధర్మశాస్తే నమః గంధోదకస్నానం సమర్పయామి
గంధం కలిపిన నీటితో అభిషేకించాలి

### భస్మాభిషేకం

విభూతిర్భూతి రైశ్వర్యం అపమృత్యుహరం శుభం
స్నానార్థంతే ప్రయచ్ఛామి హృష్యతాం సురనాయకా
శ్రీ ధర్మశాస్తే నమః విభూతి స్నానం సమర్పయామి
విభూతి జలంతో అభిషేకం చేయాలి

శుద్ధోదక స్నానం

ఆపోహిష్టా మయోభువః తాన ఊర్జే దదాతన మహేరణాయ చక్షసే యోవః
శివతమో రసః తస్యభాజయతే హనః ఉశతీరివ మాతరః
తస్మాదరంగ మామవః మస్యక్షయాయ జిన్వథ ఆపో
జనయథాచనః నానానదీ సమానీతం సువర్ణ కలశస్థితం
శుద్ధోదకేన సుస్నానం కర్తవ్యం హరినందన శ్రీ ధర్మశాస్తే
నమః శుద్ధోదకస్నానం సమర్పయామి
స్నానానంతరం ఆచమనీయం సమర్పయామి
శుద్ధమైన నీటితో అభిషేకం చేయాలి

వస్త్రం

వేదసూక్త సమాయుక్తే యజుస్సామ సమన్వితే
సర్వవర్ణ ప్రదేదేవ వాసాంసి సంగృహాణభో
శ్రీ ధర్మశాస్తేనమః వస్త్రం సమర్పయామి
నూతన వస్త్రాలు సమర్పించాలి

ఉపవీతం

బ్రహ్మావిష్ణు మహేశైశ్చ నిర్మితం బ్రహ్మసూత్రకం
గృహాణ సర్వవరదా ధర్మశాస్తా నమోస్తుతే
శ్రీ ధర్మశాస్తే నమః ఉపవీతం సమర్పయామి
నూతన యజ్ఞోపవీతం సమర్పించాలి

గంధం

శ్రీకంఠం చందనం దివ్యం గంధాడ్యం సుమనోహరం
విలేపనం సురశ్రేష్ఠ చందనం ప్రతిగృహ్యతాం
శ్రీ ధర్మశాస్తే నమః దివ్యపరిమళ గంధాన్ ధారయామి
చందన గంధాన్ని స్వామికి సమర్పించాలి

కుంకుమ

హరిద్రాచూర్ణ సంయుక్తం కుంకుమం కామదాయకం
నానా పరిమళం దివ్యం గృహాణ గుణభూషిత
శ్రీ ధర్మశాస్తే నమః అలంకరణార్థం హరిద్రాచూర్ణ కుంకు
కుంకుమ తిలకం దిద్దాలి

అక్షింతలు

అక్షతాన్ తండులాన్ శుభాన్ కుంకుమేన విరాజితాన్

హరిద్రాచూర్ణ సంయుక్తాన్ గృహాణామర వందిత
శ్రీధర్మశాస్తే నమః అక్షతాన్ సమర్పయామి
స్వామిపై అక్షతలు వేయాలి



పుష్పం

మల్లికాది సుగంధినీ మాలత్యదీనివై ప్రభో
మయాహృదాని పూజార్థం పుష్పాణి ప్రతిగృహ్యతామ్
శ్రీ ధర్మశాస్తే నమః పుష్పమాలాన్ సమర్పయామి
పుష్పమాలలు సమర్పించాలి

**అధాంగ పూజ**

పూలు, అక్షతలతో పూజచేయండి
ఓం పంబా బాలాయ నమః
ఓం గుహ్యాతి గుహ్యాగోప్త్రే నమః
ఓం అంకుశ ధరాయ నమః
ఓం జగన్మోహనాయ నమః
ఓం ఉత్తామవైభవాయ నమః
ఓం ఫాలేందుమౌళి తనయాయ నమః
ఓం హరిహర పుత్రాయ నమః
ఓం దక్షిణామూర్తిరూపకాయ నమః
ఓం వరదాన కీర్తయే నమః
ఓం త్రిలోక రక్షకాయ నమః
ఓం మణిపూరాబ్జ నిలయాయ నమః
ఓం పాశహస్తాయ నమః
ఓం మంత్ర రూపాయ నమః
ఓం వజ్రమాలాధరాయ నమః
ఓం సూర్యకోటి సమప్రభాయ నమః
ఓం గ్రామపాలకాయ నమః
ఓం తీక్ష్ణ దంష్ట్రాయ నమః
ఓం కారుణ్యామృతలోచనాయ నమః
ఓం రత్నకుండల ధారిణే నమః
ఓం శివప్రదాయ నమః
ఓం లాస్యప్రియాయ నమః
ఓం జటామకుట ధరాయ నమః
ఓం శ్రీహరిహరపుత్ర స్వరూప ధర్మశాస్తే నమః

పాదౌ పూజయామి
గుల్ఫౌ పూజయామి
జంఘే పూజయామి
జానునీ పూజయామి
ఉరుం పూజయామి
కటిం పూజయామి
గుహ్యం పూజయామి
నాభిం పూజయామి
ఉదరం పూజయామి
వక్షస్థలం పూజయామి
పార్శ్వౌ పూజయామి
హస్తాన్ పూజయామి
హృదయం పూజయామి
కంఠం పూజయామి
ముఖం పూజయామి
కపాలం పూజయామి
దంతాన్ పూజయామి
నేత్రే పూజయామి
కర్ణౌ పూజయామి
శిరః పూజయామి
లలాటం పూజయామి
అనఖాన్ పూజయామి
సర్వాణ్యంగాని పూజయామి



ధూపం
దశాంగం గుగ్గులోపేతం సుగంధంచ సుమనోహరం
ధూపం గృహాణ దేవేశ భక్తానుగ్రహకారక
శ్రీ ధర్మశాస్త్రే నమః ధూపమాఘ్రాపయామి
అగరుధూపాన్ని స్వామికి చూపండి

దీపం
దీపం గృహాణ దేవేశ ఘృతవర్తి సమన్వితం
జ్ఞానరూపాయ నిత్యాయ నిర్మలాయ నమోస్తుతే
శ్రీ ధర్మశాస్త్రే నమః దీపం దర్శయామి
దీపం చూపండి

నైవేద్యం
భూర్భువస్సువః తత్సవితుః వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్. దేవ సవిత ప్రసువ సత్యం త్వర్తేన పరిషించామి.
అమృతోపస్తరణమసి
ఓం ప్రాణాయ స్వాహా
ఓం అపానాయ స్వాహా
ఓం వ్యానాయ స్వాహా
ఓం ఉదానాయ స్వాహా
ఓం సమానాయ స్వాహా
ఓం ధర్మశాస్త్రే నమః





నైవేద్యం షడ్రసోపేతం నానాభక్ష్య సమన్వితం
శబరీశ గృహాణత్వం భక్త్యాదత్తం మయాప్రభో
ఓం శ్రీ హరిహర పుత్రస్వామినే నమః దివ్యాన్న పాయసం, మాషాపూపం, నారికేళ ఖండద్వయం, కదలీఫలం, అమృత ఫలాన్ నివేదయామి.
మధ్యే మధ్యే అమృత పానీయం సమర్పయామి
అమృతా పిధానమసి. నైవేద్యానంతరం హస్తౌ ప్రక్షాళయామి. పాదౌ ప్రక్షాళయామి. ఆచమనీయం సమర్పయామి
ఉద్ధరణితో నీళ్లు పళ్లెంలో విడిచిపెట్టాలి.

తాంబూలం
పూగీఫల సమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం
కర్పూర చూర్ణ సంయుక్తం తాంబూలం ప్రతిగృహ్యతామ్
శ్రీ ధర్మశాస్త్రే నమః తాంబూలం సమర్పయామి
తమలపాకులు, వక్క, పళ్లు సమర్పించండి.

పంచవర్తి నీరాజనం

పంచవర్తి సమాయుక్తం ఘృతేన సుపూరితం
నీరాజనం గృహాణేదం భూతనాథ జగత్పతే
శ్రీ ధర్మశాస్తే నమః పంచముఖదీపం సమర్పయామి




అయ్యప్ప స్వాములు పడిపూజా కార్యక్రమాన్ని సామూహికంగా నిర్వర్తిస్తారు. చెక్కతో కానీ, అరటిదొప్పలతో కానీ పద్దెనిమిది మెట్లు నిర్మిస్తారు. దానికి పైన పీఠం అమర్చి అయ్యప్ప ప్రతిమను, లేదా చిత్రపటాన్ని ఉంచుతారు. యధావిధిగా స్వామికి షోడశోపచార పూజ చేసిన అనంతరం పద్దెనిమిది మెట్లపై భక్తిపై దీపాలు వెలిగిస్తారు. ప్రతిమెట్టుకూ కర్పూరనీరాజనం సమర్పిస్తారు. ఇరువైపులా దీపాలు వెలిగిస్తారు.

ఒకరు దీపాలు వెలిగిస్తుండగా మిగిలినవారంతా పడిపూజ పాటను పాడుతూంటారు. ప్రతిమెట్టుపైనా దీపాలు, కర్పూర నీరాజనం పూర్తయ్యేవరకు ఆ మెట్టుకు సంబంధించిన చరణం పాడుతూ పల్లవిని ఎన్నిసార్లైనా పాడవచ్చు.

## తిరుప్పడి పాట

ప్రతి వాక్యం చివర పల్లవిని పాడుతూ ఉండాలి
ప్రతిమెట్టుకు హారతి ఇవ్వడం పూర్తయ్యేవరకు పల్లవితో భజన కొనసాగాలి

**స్వామి పొన్నయ్యప్పా అయ్యనే పొన్నయ్యప్పా**
**స్వామియే శరణం - శరణం పొన్నయ్యప్పా**

ఒన్నామ్ తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
రెండాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్పా
మూడాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
నాలుగాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
ఐదాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
ఆరాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
ఏడాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
ఎనిమిదాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
తొమ్మిదాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
పత్తాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
పదకొండాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
పన్నెండాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
పదమూడాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
పదునాలగం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
పదునైదాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
పదునారాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
పదునేడాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప
పదునెట్టాం తిరుప్పడి శరణం పొన్నయ్యప్ప

పడిపూజవేళ ఈ ఘట్టం అతిముఖ్యమైనది. పద్దెనిమిది మెట్లపై రెండేసి దీపాలు, కర్పూర నీరాజనాలు సముజ్జ్వలంగా వెలుగొందుతున్న వేళ అయ్యప్ప శోభను చూడడానికి రెండుకన్నులూ చాలవు.

సూచన : పద్దెనిమిది మెట్లపై దీపాలను వెలిగించిన తరువాత భజన కార్యక్రమాన్ని కొనసాగించవచ్చు. తరువాత పక్క పేజీలో ఇచ్చిన ఉపచారాలను చేయాలి. చిట్టచివరిగా తీర్థస్వీకారం, భక్తులకు ప్రసాదవితరణ జరగాలి.





## కర్పూర నీరాజనం

యజ్యోతి స్సర్వలోకానాం తేజసాం తేజముత్తమం
ఆత్మజ్యోతిః పరంధామ నీరాజనమిదం ప్రభో
శ్రీ ధర్మశాస్తే నమః సర్వాపరాధక్షమాపణార్థం
సమస్త మంగళావాప్త్యర్థం అనంతకర్పూర నీరాజనం సందర్శయామి
నీరాజనానంతరం శుద్ధ ఆచమనీయం సమర్పయామి
ఏకహారతి చివర నీటిబొట్టు వదిలి హారతి తీసుకోండి.

## మంత్రపుష్పం

ఓం తత్పురుషాయ విద్మహే వక్రతుండాయ ధీమహి తన్నోదంతిః ప్రచోదయాత్
ఓం తత్పురుషాయ విద్మహే మహాసేనాయ ధీమహి తన్నో షణ్ముఖః
ప్రచోదయాత్
ఓం భూతనాధాయ విద్మహే మహాదేవాయ ధీమహి తన్నో శాస్తా ప్రచోదయాత్
ఓం భూతాధిపాయ విద్మహే భవపుత్రాయ ధీమహి
తన్నః శాస్తా ప్రచోదయాత్
అయ్యప్పస్వామినే నమః మంత్రపుష్పం సమర్పయామి
అక్షతలు చేతిలో ఉంచుకుని ఈ కిందిశ్లోకం చెబుతూ
మూడుసార్లు ప్రదక్షిణ చేయాలి.



యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ
తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదేపదే
పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః
త్రాహిమాం కృపయాదేవ శరణాగతవత్సల
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ
తస్మాత్ కారుణ్య భావేన రక్షరక్ష హరిహరాత్మజా
అయ్యప్ప స్వామినే నమః ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి
అక్షతలు స్వామిపై వేసి కూర్చోవాలి.
ఆవాహిత దేవేభ్యో నమః శక్త్యుపచార, భక్త్యుపచార, రాజోపచార పూజాం సమర్పయామి. అక్షతలు నీళ్లు పళ్లెంలో వదలాలి. లేచి నిలబడి కింది నమస్కార మంత్రాలు చెప్పాలి.

## నమస్కార మంత్రం

ప్రతి శ్లోకం తరువాత స్వామియే శరణం అయ్యప్ప అని పలికి నమస్కరించాలి.
లోకవీరం మహాపూజ్యం సర్వరక్షాకరం విభుమ్
పార్వతీ హృదయానందం శాస్తారం ప్రణమామ్యహమ్
విప్రపూజ్యం విశ్వవంద్యం విష్ణు శంభు ప్రియం సుతం

క్షిప్ర ప్రసాదనిరతం శాస్తారం ప్రణమామ్యహమ్
మత్తమాతంగ గమనం కారుణ్యామృత పూరితం
సర్వవిఘ్నహరం దేవం శాస్తారం ప్రణమామ్యహమ్
అస్మత్ కులేశ్వరం దేవం అస్మత్ శత్రువినాకరం
అస్మదిష్ట ప్రదాతారం శాస్తారం ప్రణమామ్యహమ్
పాండ్యేశ వంశ తిలకం కేరళేకేళి విగ్రహం
ఆర్తత్రాణ పరం దేవం శాస్తారం ప్రణమామ్యహమ్
పంచరత్నాఖ్య మేతద్యో నిత్యం శుద్ధః పఠేన్నరః
తస్య ప్రసన్నో భగవాన్ శాస్తారం ప్రణమామ్యహమ్

రాజోపచారాలు

శ్రీ హరిహరపుత్ర స్వరూప ధర్మశాస్తే నమః, ఛత్రం సమర్పయామి, చామరేణ వీచయామి, ఆందోళికాం సమర్పయామి, నృత్యం దర్శయామి, గీతం శ్రావయామి వేదాన్ ఘోషయామి, రథాన్ ఆరోహయామి, గజాన్ ఆరోహయామి, అశ్వాన్ ఆరోహయామి, సమస్త రాజోపచార దేవోపచార భక్త్యుపచార శక్త్యుపచార పూజాం సమర్పయామి

యధాస్థానం

అస్మాత్ బింబాత్ ఆవాహితం హరిహరపుత్ర శ్రీధర్మశాస్తారం యథాస్థానం ప్రతిష్ఠాపయామి శోభనార్థే క్షేమాయ పునరాగమనాయచ
పుష్పాక్షతలను స్వామి పాదాలపై వేయాలి.

బ్రహ్మార్పణం

అనయా పూజయాం శ్రీహరిహరపుత్ర స్వరూప శ్రీధర్మశాస్తా ప్రియతాం
ఓం తత్సత్ బ్రహ్మార్పణమస్తు
అక్షతలను తీసుకుని ఉద్ధరిణి నీటితో ఒక పళ్లెంలో విడిచిపెట్టాలి.

క్షమాపణ

అపరాధ సహస్రాణి క్రియంతే అహర్నిశం, మయాదాసోయ ఇతి మాంమత్వా క్షమస్వ పరమేశ్వర, క్షమస్వ జగదీశ్వర, క్షమస్వ పురుషోత్తమ
ఓం శ్రీహరిహరసుతన్ ఆనందచిత్తన్ అయ్యన్ అయ్యప్పస్వామియే శరణం అయ్యప్ప

తీర్థ స్వీకారం

అకాలమృత్యు హరణం సర్వవ్యాధినివారణం
సమస్తపాప క్షయకరం శాస్తపాదోదకం పావనం శుభం






## వేల్ వేల్ మురుగా

వేల్ వేల్ మురుగా వట్టివేల్ మురుగా
వేల్ వేల్ మురుగా వట్టివేల్ మురుగా
వేల్ వేలయ్య – స్కంద మురుగా
మా కోర్కెలన్ని తీర్చవయ్య స్కంద మురుగా
పచ్చనెమలి వాహనుడ – స్కంద మురుగా
నీకు పాలకావిడి తెచ్చామయ్యా – స్కంద మురుగా
పళణిమలై కొండమీద – స్కంద మురుగా
నీవు దండాయుధపాణివయ్యా – స్కంద మురుగా
గణపతికి అనుజుడివి – స్కంద మురుగా
నీవు అయ్యప్పకు అగ్రజుడివి – స్కంద మురుగా
పార్వతి పుత్రుడవే – స్కంద మురుగా
నీ భక్తులము బ్రోవమయ్యా – స్కంద మురుగా
స్వామిమలై కొండమీద – స్కంద మురుగా
నీవు బాల సుబ్రమణ్యుడవు – స్కంద మురుగా
వల్లి మనసు దోచావు – స్కంద మురుగా
నీవు దేవసేనాపతివయ్య – స్కంద మురుగా
శక్తి వేలన్ బాలనక్కు హరోంహర
స్కందనకు హరోంహర – వేలనకు హరోంహర

## శరణం గణేశ

గణేశ శరణం శరణం గణేశ
గణేశ శరణం శరణం గణేశ
మూషిక వాహన శరణం గణేశ
మూలాధారా శరణం గణేశ
మోదకహస్త శరణం గణేశ
మోక్ష ప్రదాయక శరణం గణేశ
చామరకర్ణా శరణం గణేశ
పవితీ నియమా శరణం గణేశ
విలంబిత సూత్ర గణేశ
విఘ్నవినాయక శరణం గణేశ
సిద్ధివినాయక శరణం గణేశ
బుద్ధివినాయక శరణం గణేశ
షణ్ముఖ సోదర శరణం గణేశ
మణికంఠ సోదర శరణం గణేశ

## అంబ పరమేశ్వరి

అంబపరమేశ్వరి అఖిలాండేశ్వరి
ఆదిపరాశక్తి పాలయమాం
శ్రీభువనేశ్వరి రాజరాజేశ్వరి
ఆనందరూపిణీ పాలయమాం
వీణాపాణీ విమల స్వరూపిణీ
వేదాంత రూపిణీ పాలయమాం
కామితదాయని కరుణస్వరూపిణీ
కన్యాకుమారి పాలయమాం
మంజులభాషిణీ మంగళదాయిని
మధుర మీనాక్షి పాలయమాం
రాజస్వరూపిణీ రాజరాజేశ్వరి
శ్రీచక్రవాసిని పాలయమాం
అన్నపూర్ణేశ్వరి చాముండేశ్వరి
విశ్వవినోదిని పాలయమాం
అంబజగదీశ్వరి కాషాయాంబరి
కాళిపరాశక్తి పాలయమాం

## అయ్యా! దర్శనం

అయ్యా దర్శనం స్వామి అయ్యా దర్శనం
బంగారుకొండపై అయ్యా దర్శనం
రాయిరప్పల్లో అడవిముళ్లబాటల్లో
అలసి ఉల్లాసంగా నీకై మేము వచ్చినామయ్యా
స్వామి శరణం అయ్యప్ప శరణం శరణం అయ్యప్ప

దివ్యమైన నీ వ్రతంతో మాలవేసి
మొక్కుబడి మూటకట్టి వస్తున్నామయ్యా
పంపలో స్నానంచేసి పాపాలు వదిలి
సేవచేస్తూ పాటలు పాడి వస్తున్నామయ్యా
ఎక్కుట కష్టము కొండ ఎక్కుట కష్టము
నీచేకాచే కరిమల నీలమల ఎక్కించాలయ్యా
స్వామి శరణం అయ్యప్ప శరణం శరణం అయ్యప్ప

నీ సోపానాలెక్కివచ్చి మొక్కేనయ్యప్పా
మొదటిమెట్టున కొబ్బరికాయ కొట్టినామయ్యా
పద్దెనిమిది మెట్లు కంటికి అద్దుకుని
సన్నిధానంలో నిన్నే కొలిచేమయ్యప్ప
దోషం పోగొట్టి స్వామి మోక్షం ఇవ్వయ్యా
స్వామి కన్నుల వెన్నెల జల్లులతో బ్రోవగ రావయ్యా
అయ్యా దర్శనం స్వామి అయ్యా దర్శనం



## ముత్యాలకాంతిలో....



స్వామియే శరణం అయ్యప్ప శరణం
ముత్యాలకాంతిలో వెలిగేటి మాల
రతనాలకాంతిలో మెరిసేటి మాల
కర్పూరజ్యోతిలో కలిసేటి మాల
కనుక మణికంఠుని తులసిమణిమాల
స్వామియే శరణం అయ్యప్ప శరణం

అయ్యప్పస్వామి యొక్క అరవిందమాల
ఆనందరూపుని ఆశ్రితులమాల
కన్నిస్వాముల కంఠమలరించుమాల
స్వామియే శరణం అయ్యప్ప శరణం

పంచగిరివాసుని పడగమణిమాల
పందళబాలుని పావనమాల
పంబానదియందు మునిగేటిమాల
పరితపించేవాళ్లు కోరేటిమాల
స్వామియే శరణం అయ్యప్ప శరణం

జాతిమత భేదములు తొలగించుమాల
జగదేకవీరునితో జతకలుపుమాల
రుద్రయ్య తనయుని శ్రీరుద్రాక్షమాల
శ్రీహరి తనయుని శ్రీగంధమాల
స్వామియే శరణం అయ్యప్ప శరణం



---

పల్లవి
భగవాన్ శరణం భగవతి శరణం శరణం శరణం అయ్యప్పా
భగవతి శరణం భగవాన్ శరణం శరణం శరణం అయ్యప్ప

అనుపల్లవి
భగవాన్ శరణం భగవతి శరణం దేవనే – దేవియే – దేవియే – దేవనే ||భగ||

చరణాలు
1. నలుబది దినములు భక్తితో నిన్నే సేవించెదము అయ్యప్పా
   పగలు రేయీ నీ నామస్మరణం స్మరణం శరణం శరణం అయ్యప్పా ||భగ||
2. కరిమల వాసా పాపవినాశ శరణం శరణం అయ్యప్పా
   కరుణతో మమ్ము కావుము స్వామి శరణం శరణం అయ్యప్పా ||భగ||
3. మహిషి సంహార మదగజవాహన శరణం శరణం అయ్యప్పా
   సుగుణ విలాస సుందర రూప శరణం శరణం అయ్యప్పా ||భగ||
4. నెయ్యాభిషేకం నీకప్పా నీపాద పద్మములు మాకప్పా
   కర్పూర దీపం నీకప్పా నీ జ్యోతి దర్శనం మాకప్పా ||భగ||

తొలియాత్రికుడా శరణాగతుడా
ఇరుముడిమూటను తలను పెట్టి
కొండకోనలు దాటిదాటి
పదెనెనిమిది మెట్లెక్కుట ఎప్పుడు ఎప్పుడయా
మండలజ్యోతికా మకరజ్యోతికా
అయ్యప్ప దింతక తోం స్వామి దింతక తోం

స్వచ్ఛంగా స్నానమాడి అయ్యప్పను తలచుకొని
శరణం శరణం అని వేడుకొంటినా
కొబ్బరాకుల పందిరివేసి ముడుపుమూట చేర్చికట్టి
శబరిగిరి పోవుటకు సిద్ధమైతివా

ఎరుమేలి పుణ్యస్థలం ముట్టుకోవలె
విభూదిరాశి పేట్టతుళ్లి పాటపాడుదాం
చిన్నిచిన్ని గుడిసెలలో పూజచేయాలి
పిదప అడవులన్ని దాటిదాటి పంపచేరాలి

గణపతికి కొబ్బరికాయ కొట్టిచూపాలి
పిదప ముడుపుమూట కట్టుకుని కొండ ఎక్కాలి
పద్దెనిమిది మెట్లెక్కి అయ్యని చూడాలి
పిదప అభిషేకం అంతా కళ్లార చూడాలి



శంకరాయ శంకరాయ శంకరాయ మంగళం
శంకరీ మనోహరాయ శాశ్వతాయ మంగళం
గజాననాయ మంగళం షడాననాయ మంగళం
గురువరాయ మంగళం దత్తాత్రేయ మంగళం
రాజరామ మంగళం రామకృష్ణ మంగళం
అయ్యప్ప మంగళం మణికంఠ మంగళం
శబరిగిరీశా మంగళం శాస్తాయే మంగళం
మంగళం మంగళం నిత్యజయ మంగళం
మంగళం మంగళం నిత్యశుభ మంగళం



కె.జె. ఏసుదాసు గొంతులో ఈ పవళింపు పాట
శబరి ఆలయంలో కూడా వినబడుతుంది.
అంతకు ముందుగా ఒక పువ్వుతో
ఆలయంలోని దీపాలన్నింటినీ కొండెక్కిస్తారు.
ఒక్క దీపం మాత్రమే వెలుగుతూ ఉంటుంది.
ఆ చిరుదీపం వెలుగులో భువనమోహనమూర్తికి
గంధర్వలాలి వినబడుతూ ఉంటుంది. ఇది
అపూర్వదృశ్యం. నాదమే వెలుగై భాసిల్లుతుంది.

## పవళింపు సేవ

హరివరాసనం విశ్వమోహనం – హరితధీశ్వరం ఆరాధ్యపాదుకం
అరివిమర్దనం నిత్యనర్తనం – హరిహరాత్మజం దేవమాశ్రయే
శరణమయ్యప్పా స్వామి శరణమయ్యప్పా ||2||
శరణ కీర్తనం భక్తమానసం – భరణలోలుపం నర్తనాలసం
అరుణభాసురం భూతనాయకం – హరిహరాత్మజం దేవమాశ్రయే
ప్రణయసత్యకం ప్రాణనాయకం – ప్రణతకల్పకం సుప్రభాంచితం
ప్రణవమందిరం కీర్తనప్రియం – హరిహరాత్మజం దేవమాశ్రయే
తురగవాహనం సుందరాననం – వరగదాయుధం వేదవర్ణితం
గురుకృపాకరం కీర్తన ప్రియం – హరిహరాత్మజం దేవమాశ్రయే
త్రిభువనార్చితం దేవతాత్మకం – త్రినయన ప్రభుం దివ్యదేశికం
త్రిదశపూజితం చింతితప్రదం – హరిహరాత్మజం దేవమాశ్రయే
భవభయాపహం పావుకావుకం – భువనమోనం భూతిభూషణం
ధవళ వాహనం దివ్యవారణం – హరిహరాత్మజం దేవమాశ్రయే
కళమృదుస్మితం సుందరాసనం – కలభకోమలం గాత్రమోహనం
కలభకేసరి వాజివాహనం – హరిహరాత్మజం దేవమాశ్రయే
శ్రితజనప్రియం చింతతప్రదం – శ్రుతివిభూషణం సాధుజీవనం
శ్రుతి మనోహరం గీతాలాలసం– హరిహరాత్మజం దేవమాశ్రయే

# సందేహాలు సమాధానాలు

**ప్ర. అయ్యప్ప దీక్షలో ఉన్నప్పుడు భోజన నియమాలేమిటి?**

జ. అయ్యప్ప దీక్షలో ఏకభుక్తమే ముఖ్య విధి. అంటే పగటిమాత్రమే భోజనం చేయాలి. రాత్రిసమయంలో అల్పాహారం తీసుకోవాలి. ఈ రకమైన ఆహార నిబంధన వల్ల ఉదరశుద్ధి, కాయశుద్ధి కలుగుతుంది. ఉల్లి, వెల్లుల్లి వంటి తామసిక పదార్థాలను భుజించకూడదు.

**ప్ర. శబరియాత్రలో ఉన్నప్పుడు ఇంటిలోని పీఠాన్ని ఏం చేయాలి?**

జ. యాత్రకు వెళ్లిన వ్యక్తి క్షేమంగా ఇంటికి తిరిగి వచ్చే వరకు, అతని కుటుంబ సభ్యులలో ఎవరో ఒకరు స్వామికి పూజాదికాలు చేస్తూ ఉండాలి.

**ప్ర. దీక్షాకాలంలో ఇంటికి దూరంగా వెళ్లాల్సి వస్తే నిత్యపూజలెలా చేయాలి?**

జ. నిత్యపూజతో పాటు అయ్యప్పస్వాములు తమ మెడలోని మాలలో ముద్రలో ఉన్న స్వామివారిని కూడా పూజిస్తారు. ఇంటికి దూరంగా వెళ్లినప్పుడు మాలలోని స్వామినే పూజించి సంతృప్తి చెందాలి.

**ప్ర. తిరుగుయాత్రలో పుణ్యక్షేత్రాల్లో మాల విసర్జించవచ్చా?**

జ. కూడదు. ఇరుముడి కట్టుకున్న స్థలానికి తిరిగివచ్చిన తరువాతే మాల విసర్జన చేయడమే ఉత్తమం. అకారణంగా మార్గమధ్యంలో మాల విసర్జన చేయకూడదు.

**ప్ర. అయ్యప్ప మాల ఎలా ఉండాలి?**

జ. తులసి, రుద్రాక్ష, స్ఫటికం, చందనం, తామర మొదలైన పూసలతో అల్లిన మాల ధరించవచ్చు. రాగి తీగలతో అల్లిన మాలలు విశేష ఫలితాన్నిస్తాయి. తులసి లేదా రుద్రాక్ష మాలలు మిగతా వాటికంటే శ్రేష్ఠం. మాలలో 54, 72, 108 సంఖ్యలో పూసలు ఉంటే మంచిది.

**ప్ర. దీక్షాకాలంలో ఇతర రంగు వస్త్రాలు ధరించకూడదా?**

జ. నలుపు, ఎరుపు, పసుపు, కాషాయం మొదలైనవి దీక్షావస్త్రాలు. వాటిలో నలుపు శనిబాధా నివారణకు, యాత్రా మార్గంలో మృగాల బారిన పడకుండా ఉపయోగపడతాయి. మైల అంటినవాళ్లను నల్లదుస్తులు దూరంగా ఉంచుతాయని దీక్షలో నల్లవస్త్రాలు ధరించడం ఉత్తమం అంటారు. నలుపు శని బాధా నివృత్తికి, నీలం రాహుదోష నివారణకు, కాషాయం అరిషడ్వర్గాలపై విజయానికి ధరిస్తారు.

# శబరియాత్ర

**రైలుమార్గం**

తొలిసారి మాలధారణ చేసిన కన్నెస్వాములు ముందుగా ఎరుమేలిలోని వావరు స్వామిని దర్శించుకోవాలి. అనంతరం శబరిమలకు వెళ్లాలి. వీరికి కొట్టాయం రైల్వేస్టేషన్ దగ్గరగా ఉంటుంది. కొట్టాయం నుంచి ఎరుమేలి 49 కిలోమీటర్ల దూరం. అక్కడినుంచి 119 కిలోమీటర్ల దూరంలో ఉన్న పంబకు బస్సు సౌకర్యం లభిస్తుంది. ఇప్పటికీ ఎరుమేలి నుంచి పంబమీదుగా నడిచివెళ్లే యాత్రికులు కనిపిస్తారు. దీనినే పెరియపాదం అంటారు. ఈ నడకమార్గం 61 కిలోమీటర్లు. చెంగనూరు రైల్వేస్టేషన్ నుంచి పంబకు 93 కిలోమీటర్ల దూరం. పంబనుంచి శబరిమల క్షేత్రం సుమారుగా 5 కిలోమీటర్ల దూరంలో ఉంటుంది.

**రోడ్డు రవాణా :** కోయంబత్తూరు, పళని, తెన్ కాశి క్షేత్రాలనుంచి బస్సు సౌకర్యం ఉంటుంది. శబరిగిరికి బేస్ క్యాంపుగా వ్యవహరించే నీలక్కల్ ప్రాంతంలోనే తెలంగాణ రాష్ట్రప్రభుత్వం మనవారికోసం యాత్రాసదనం నిర్మిస్తోంది. ఇది పంబనుంచి 75 కిలోమీటర్ల దూరంలో ఉంది.

**డోలీలు :** పంబనుంచి 5 కిలోమీటర్ల దూరంలోని అయ్యప్ప సన్నిధికి ఎవరైనా కాలినడకనే వెళ్లాలి. నడిచివెళ్లలేని యాత్రికులకు డోలీలు లభిస్తాయి.

**అత్యవసర సమాచారం**

దేవస్థానం అడ్మినిస్ట్రేటివ్ ఆఫీస్
శబరిమల: 4739-2202038, పంబ: 4739-2203442
ప్రాథమిక చికిత్సాలయం
సన్నిధానం: 04735-202101, పంబ : 04735-202101, 04735-203590, 203591
పోలీస్ కంట్రోల్ రూమ్
పంబ: 04735-203386, సన్నిధానం: 04735-202016
అగ్నిమాపక శాఖ
సన్నిధానం: 04735- 202033
అంబులెన్స్
పంబ: 04735-203590, 04735-20359, నీలక్కల్: 04735-1298
అప్పాచ్చిమేడులో హృద్రోగ చికిత్సాలయం : 04735 203350
భాగ్యనగర్ అయ్యప్పసేవా సమితి: 90300 75899, 98480 83376
తెలంగాణ అయ్యప్ప సేవాసమితి: 9246964965